దాదాపు క్రీస్తుపూర్వము 2747 ప్రాంతమున కలి ఆరంభించియుండవచ్చుననియు కొందరు గణితపండితులు వాదించుచున్నారు. (1) సప్తర్షులు యేస్థానమున నుండినదియు నిర్ణయించుటలోగల భేదములనుబట్టి చేతావని గ్రంథకర్త మున్నగువారు కలియుగ మిప్పుడే యంతమని వ్రాసియున్నారు. యుధిష్ఠిరశక మప్పు డేర్పడలేదని కొందరి యభిప్రాయము. భారత యుద్ధకాల నిర్ణయమునందుగూడ పలువురు పండితులు పలురీతుల యభిప్రాయములు గల్గియుండిరి. వానిలో ముఖ్యము లీ క్రిందివిధముగా నున్నవి.

జస్టిస్ ఫర్గిటరు సిద్ధాంత ప్రకారము భారతయుద్ధం క్రీ. పూ. 1810 సం॥
శ్రీశచంద్ర విద్యార్ణవుడు ... ... 1768 ,,
,, మరియొక లెక్కను ... 1922 ,,
స్వామి కన్నుపిళ్ళ ... ... 2402 ,,
కల్యాణపండితుడు ... ... 2448 ,,
గోపాలయ్యరు ... ... 1177 ,,
జోన్సుపండితుడు ... ... 2402 ,,
తిలకుమహాశయుడు ... ... 1440 ,,
నడింపల్లి జగన్నాధరావు పంతులు ... 3189 ,,
కోడాలి లక్ష్మినారాయణ ... ... 980 ,,
కొన్ని పురాణములు, భాగవతములనుబట్టి ... 1470 ,,

వీరందరును మనకు లభించిన ఆధారము లన్నిటిని పరిశీలింపకపోవుట చేతనే యీవిషయమై వారి అంత్యనిర్ణయములు వివిధమై తృప్తి చేయజాలకపోవు కారణమని చెప్పవలసియున్నది. వీరిలో మొదటి ఇర్వురు పురాణములలోని లెక్కలనుబట్టియు జోన్సు పరాశర సిద్ధాంతమునుబట్టియు, దక్కినవారు వరాహమిహిరాది గణితశాస్త్రజ్ఞుల వాక్యములలోని యర్థభేదములను బట్టియు, కోడాలి లక్ష్మినారాయణగారు జైనవాఙ్మయము, సప్తర్షులు ముందుకు నడచునని చేసిన విపరీత సిద్ధాంతాదులబట్టియు వ్రాసిరి. జగన్నాధరావుపంతులు అయన చలనాదులతో కలియుగారంభమును దక్కినశాస్త్రము

(1) Astrological Magazine, Banglore. Sept. 47



లకు సరిపెట్టి వ్రాసిరిగాని పురాణములలోని పాలన సంఖ్యలను గమనింపక పోయిరి. గాని వీనియన్నిటిలోను మొదటి యిర్వుర కాలములే మనకు యథార్థ పరిజ్ఞానమును గల్గించుటలో తోడ్పడుచున్నవి. జగన్నాధరావు పంతులుగారు తక్కినవారి వాదముల నన్నిటిని ఖండించుచు "ఆంధ్ర మహా సామ్రాజ్యము" అను గ్రంథములో వివరముగ తెలిపియున్నారుగాన ఆ చర్చయంతయు నిచ్చట మానితిమి. కలియుగము క్రీ.పూ. 3102 అనుటకు వారు తగిన ప్రమాణములన్నియు సేకరించిరిగాని భారతయుద్ధకాల నిర్ణయములో నా కలియుగమునే అప్పటిదిగా భావించుటలో వారు పురాణములలోని లెక్క సరిపెట్టలేకపోయిరి. అయినను వారికి దేవమాన సంవత్సరములన్నియు కల్పితములుగా దోచకపోయినందున వాస్తవికచరిత్ర వారికి బోధపడలేదు. సప్తర్షులు ముందుకు నడతురని లక్ష్మినారాయణగారు చేసెడి వాదమే పురాణమును వప్పుకొనుటలేదు. సరిగదా గణితశాస్త్రజ్ఞులెవను చెప్పుటలేదు. మన పురాణ ప్రామాణ్యములకన్న జైనగ్రంథ ప్రామాణ్య మింకను హీనముగా నతిశయోక్తులతోను, షుమారుగాను ఉండునేగాని విశ్వసనీయముగాదు. గోపాలయ్యరు లక్ష్మినారాయణగార్ల వాదముల ననుసరించినచో చాల వంశములవారి పాలన లేకుండనే పోవలెను. గాని యిది యసంభవము. యుధిష్ఠిర శకారంభమునే సందేహించు పండితులు కొందరున్నారు. ఆ శకమును దెల్పెడి యొక శాసన దృష్టాంతము గలదు. అది యీ క్రిందివిధముగా నున్నది.

"యుధిష్ఠిరశకము 89 సం॥న ప్లవంగ సం॥లో సహస్యమాసము అనగా పుష్య బ 30 అమావాస్య సోమవారమునాడు జనమేజయ మహారాజు తుంగభద్రానదీతీరమున గల యొక స్థలమును అచటి మునిబృంద సుతమునకు తన తండ్రి తాతల పుణ్యమునకై అపరాగసమయమున దానమిచ్చెను."

(ఇండియన్ ఆంటిక్వేరి వాల్యూము 4 పుట 333 లోగల సంపూర్ణ శాసనమునకు సారాంశము.)

లిపి సాంప్రదాయమును బట్టి యీ శాసనము తర్వాతివారెవ్వరో కల్పించి వ్రాయించినట్లు పరిశోధకు లభిప్రాయపడియున్నారు గాని యొకవేళ